# పలితకేశము

## కవి-రవి

[పద్యకావ్యములు]



కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి



కవికోకిల గ్రంథమాల

పెమ్మారెడ్డిపాళెం - ఎల్లాయపాళెం

నెల్లూరు జిల్లా

# అర్పణము

మరవగారాని తొలుప్రేమ మరవజేసి
చీకటింట గప్పురదివ్వె సెమ్మెనిలిపి
వలపుచితిభూతి మల్లికావల్లినాటి
బ్రతుకుబాటల పుప్పొడిపరచి, మరల
జీవితాసలు రెక్కొని చేవగిల్ల
భగ్నహృత్పాత్రసంధించి ప్రణయమధువు
అంచుపారలగనింపిన అన్నపూర్ణ
కర్పణమొనర్తు నీకృతి నమలరక్తి

"వేళ కన్నంబు దినుటయు, వేగులేచి
చెనుచెట్లు విచారించు చింత లేక
పోయినను బోని, గడ్డంబు పొదపుకొనగ
క్షౌర మొనరించుకొననైన దీరలేదె ?

తలపయి దువ్వెన మెదలిన
పొలకువ గనుపింప దెపుడు; పూర్ణంబుగ ట్రం
కుల గూరియున్న దుస్తులు
వెలుగుం గనబోవు పెండ్లిపిలుపులనాడున్.

పగలు ప్రొద్దస్తమానము పడకపైన
బుస్తకము లిరుప్రక్కల బొరలు చుండ
జదువు చదువని యొండెద్ది సరకుగొనక
తలుపు బిగియించుకొన్న నాతరమె పిలువ ?

ఏది యెటు లున్న, దినగండ మింక నొకటి :
పిలువ వచ్చిన గొంతుక నులిమివేయు
నంత కోపంబు సన్న్యాసులైన మేలు;
ఎంత పొరపాటు సంసారియింట బుట్ట ?

అదిమత్త్వము మీయందు నలరెనేమొ !
మానవద్వేష మెక్కెంత మతిని బడెనొ ?
నాగరకజీవనము కొన్ని నాళ్లనుండి
పవలితిరి; లేక మి మ్మది వదలెనొక్క ?

కవులు సౌందర్యరసపిపాసువు లటంచు
జెప్పితిరి మీ రొకప్పుడు చిత్తమలర;
అట్టి రమణీయతాప్రీతి యట్టితలపు
లెటుల నావిరియైపోయె నింతలోన ?''

అని తన యభిరుచి దెల్పుచు
అని యననటు నన్ను దాకనాడుచు గోపం
బున కెపమీయని చిరునగ
వొనరిచి నను విగతబాణు నొనరిచె సతియుఙ్.

కని గ్రంథంబుల నేటుబుక్కుల దిరస్కారంబు సూచింప దిగ్గున నెక్కుమ్మడి సందిటన్ జవిరి ప్రోగుంబెట్టి మేజాపయిన్; విషయాచ్ఛాదనరక్షితంబగు దురావేశంబు వీక్షించి స్త్రీజనసహజంబు ప్రతిక్రియారహితచేష్టానైపుణిన్ మెచ్చితిన్.

ఏమనుకొందునో యనుచు నింతల నంతల దారసిల్లి నా మోమున గోపచిహ్నములు మోసిడకుంటకు సంతసించుచుం గామిని నీరమున్ బురుసు కత్తిని సబ్బును దర్పణంబు దానే మును సిద్ధపెట్టి యికనేని కడంగుడు 'షేవు' కంచునన్.

ఆననము నద్దమున గాంచ, నతివపాడుపు
లన్నియు సహేతుకములుగ నాత్మదోచె;
బురుసు గడ్డంబుపై బెట్టి నురుగుదేర
నెరుముచుంటిని; భావంబు తిరుగుచుండె.

దారింబోయెడు బాటసారి యితర ధ్యాసంబునందుండ, గాల్జారన్ మేల్కనురీతి నామనము స్వేచ్ఛాపుష్పకంబెక్కి దిక్ప్రారంబుల్ కడముట్టుచుండగ హఠాద్భంగంబుచేకూరె; గన్నారం గాంచితి వెల్లనైన యొక కేశాంకూరమున్ మీసలన్.

భరముగ గుండె లో నెగిరిపడ్డటు లయ్యెను; జవ్వనంపు బం
గరుకలలెల్ల రెక్కలెడుగుం బరతెంచెడు పక్షిశాబముల్
కరణి గులాయముల్ విడుట కన్నులగట్టె; క్షణంబునన్ మనో
హరముగు జీవితాంబరము సంజుపకశ్మలమై కనంబడెన్.

విరియురేకుల మంచుతుంపురులు జార
బ్రొద్దుపొడుపున జలిగ్రాగు పూవునందు
జీవపురు పొందు చేరిన జాడ తోచె
మీసమున వెల్లవెంట్రుక మోసుగాంచ.

మున్ను ఎన్నెన్ని మార్లు మోమోట లేక
కత్తిరించితి మీసంబు; కలుగ వెట్టి
మార్పు లాందోళనంబులు మానసమున;
అది నిరర్థకపరభృత మనుచునుంటి.

ఒక్కొకప్పుడు ఎందుకు నొదపనట్టి
యల్పవస్తువె ప్రముఖమౌ నదనుబట్టి;
నల్లవెంట్రుకమొట్టిక తెల్లనౌట
సకలమానవ దుర్వార శత్రు వయ్యె.

చెలి యది గాంచినం బరిహసించునొయేమొ! జపాసుమాంతరో
జ్జ్వల మధురాధరాంచల లసన్మృదుహాసము మందగించునో!
యలకుపచూపి పచ్చె మసలాతపటన్ని నిరాకృతిఁ నసుం
బలకనసేయునో యనుచు ప్రుక్కెనిమేషము, ధైర్యమూనితిఁ.

ఏమిపోరపొచ్చెమెఱుగక యిన్నినాళ్లు
ఆలుమగలము దాంపత్య మనుభవింప
బాసకములోన బుడకట్టు పచ్చినావె
తెల్లవెంట్రుక, నిరస్సదయ, నేడు.

దానిని గాంచినయంతనె
మానసమున ద్వేషవహ్ని మల్లడిగొన నే
బూనితి చేతం గత్తెర
ఖూనిసేయంగ దానిని క్రూరుని భంగిఁ.

"అకుమపుంగు పంఘటుల నకులకుం గనరాక యొంటివై
నా కనుబ్రామియాటున మనం దలకొంటివె యిన్నినాళ్లు; నా
సాకతమైన నెంచవు; విచారములేక పఠింతు" నంచు నే
వాకొని కత్తిరింప, నది పాయుక లోపలజిక్కె బ్రెలుయఁ.

ననుగని "ఓ వెడంగ, ఇదినాయమె ఒంటరినైననన్ను లో
గనికరమేమిలేక చిరుకత్తెరనొత్తితి వంత బోయెనే?
దినదిన జృంభమాణమయి తేజరిలంకెడు మచ్ఛరీర వ
ల్లిని మొదలంటగోసి వెడలింపగ సాధ్యమె యెట్టివానికిన్.

నేడు ఛేదించితివి, రేపు చూడు నన్ను
పలువిధంబున మోసెత్తి తొంగిచూతు;
పృథివిజనులకు గాలంబు వేయుచున్న
ప్రశ్నగుర్తును, బదులేమి పలుకగలవు?

శత్రువును గాను, మానవమిత్రమౌదు ;
సత్యమెరుగక, దమోరుద్ధచక్షులైన
వారికి వెలుంగుజూప నవ్యాజకరుణ
గాగడాపట్టుచుందును గాలనియతి.''

అనియిటు ప్రేలెడు వెంట్రుక
తునుకంగని యంటి "నోసి, తోరపుగర్వం
బున దేవదూత వీవే
యనుకొని రక్షించుమాటలాడెద పరరే!

కొలదియెఱుగని యువ్వతి! గొఱ్ఱెతోక
యెంతయెదిగిన లొడితెడే! యింకనైన
బుద్ధితో నెఱవాగక పోదువేని
పదుప్పపక్కను; లేక, చెప్పరము పక్క."

అనుచు దిరస్కరింప రవమైన మనంబున జిన్నపోక రె
క్కొని యుదిపల్కె: "మిమ్ము ననగూడదుగాని కవీశులౌట; మీ
రనినటు నేను నల్పతరమైన, ననుం బరిమార్పలేని మీ
ఘనతయు బుద్ధివైభవవికాసము అంతకు దక్కవేగదా?

మాటకుఁ మాట తర్కంబు మిదులుదాటు;
నుడుకుమాటల నేమి ప్రయోజనంబు?
కాలసమ్రాట్టు నిత్యకైంకర్యమందు
మెలగుచుండుట ఘనులము మేముకామె?"

కనివినియెఱుగని వెంట్రుక
యొననిక్కను డంబరంబు మురళించుటలున్
వినివిని యచ్చెరువందుచు
బనిదోపకయుంటి రిచ్చపడినవిధానన్.

"కనుమోయా, యిల రాజ్యభోగములు సౌ
ఖ్యంబుల్ గృహారామముల్
ధనధాన్యంబులు బంధుమిత్రులును గాం
తాపుత్ర సౌభాగ్యముల్
మానరన్, సర్వము శాశ్వతంబని తృషా
లోలాంతరంగంబునన్
దినముల్ పుచ్చెడు మూఢమానవునకున్
దీపంబు నందిచ్చెదన్.

చెలువలు ప్రేముడింగడుము చిక్కనికౌగిళులన్ సుఖించి ని
చ్చలు మధురాధరామృతరసంబున మత్తిలి యౌవనంబు ని
శ్చలమని యెంచి కామపరిచర్యయొనర్చుచు భావికాలచిం
తలు తలపెట్టబోని పశుతత్త్వుని నిద్దురలేప వచ్చితిన్.

కాలరథప్రచారమొకఖండనిమేషమునాగబోదు భూ
పాలుని యాజ్ఞకుం, బరమభక్తుని మ్రొక్కుకు, దిక్కులేని చం
డాలుని కంటినీటి కెరటాలకు; గాలము మూల్యమోయి, యా
కాలుడు రాకమున్నె వెదుకందగు విస్మృతజీవితార్థముల్.

ధనధాన్యంబులుకూడబెట్టి కుడుపన్ దానంబుసేయన్ మనం
బునరాకున్కి శ్రమంబె నీకు దుడకుం బ్రోగౌను; నిల్లెందరో
ధనికుల్ దాచినపెన్నిధుల్ పరులచేతంజిక్కి భోగింపరే?
తిను, వెచ్చింపుము, దానమిమ్ము ప్రమిదన్ దీపాంకురంబుండగన్.

ధనము గలవార లెందరొ
మని చచ్చిరిగాని వారిమాటయు గలదే ?
జనహితకార్యంబులకై
తనుధనములొసంగ గీర్తి దనరదె చిరమై?

గడియారంబున టక్కుటక్కుమని వేగంగొట్టు శబ్దంబు వెం
బడి నాయుష్యము ఒక్కటొక్కటిగ సోపానంబులన్ డిగ్గు; నొ
త్తిడులశక్తియు సన్నగిల్లె; బరసందేశంబు రానున్న దో
బడుగా, యాపదినాళులైన విడకే పాథేయ మార్జింపుమా.

పరులను నోరుగొట్టి పలుపాపముల న్నిరతం బొనర్చి ని
ష్కరుణముగా దరిద్రులను గారియపెట్టి ధనంబుగూర్చి కొ
ప్పెరలకునింపి చూచుకొని ప్రీతివహింతువు; వారసుల్ నిరం
తరమును నీదుచావునకు దైవము వేడుదురోయి లుబ్ధుడా.

ఆర్జనంబునకెపుడు వ్యయంబెలెక్క
వ్యయమునకు మంచివినియోగమౌటలెక్క;
అదియిదియులేని యధమ నిరర్థజీవి
పుట్టిచచ్చిన లాభంబు కట్టిరాదు.

ఎందరు నెందరో మహితులీయిల బుట్టియు గిట్టినారు; వా
రందర పాదలాంఛనము లంకితమయ్యె యశఃపథంబునన్;
ఇందనుకన్ సగంబు గతియించెను జీవిత; మే మొనర్పకే
క్రిందిన నేమినిల్చును ధరం? బెనుదోసెడుబూదిచప్పనన్.

ధనము గడింపవచ్చు, సతతంబు సుఖింపగవచ్చు, జీవితం
బున నివియే సమస్తమున బోలునె? యిందుల గాటిగేటు దా
టిన గొరయౌన దెయ్యది? గడించినజ్ఞానమె యాత్మ సంటి వ
చ్చును బరలోకమందయిన; జొప్పరివై చరియింపమేలగున్.

వైనికాపశ్యకంబులు తక్కవైన
జ్ఞానసంపాదనమునకు గాలమబ్బు;
పూరిగుడిసెల నివసించి పూర్వఋషులు
ఉపనిషచ్ఛాస్త్రముల బ్రజ కొసగలేదె?

ఆసలు పెంచి తీర్చుకొన నర్థము నెట్టులో సంగ్రహించు నా
యాసముతోడ జీవితము నంతయు బుత్తువు; నీదుచర్య వ్య
త్యాసములేని యంత్రగతియౌ; జననంబును బెండ్లి బిడ్డలున్
గ్రాసనివాస; మంత దుదగాంచు జరిత్రము మృత్యుపూర్తిగన్.

దినమున కొక్కపూటయిన దిండికిలేక దరిద్రమానవుల్
మసరుచునుండ నీధనము వాసనకట్టు బిగించికట్టి యే
మానుభవ మొందబోయెదవొ? యందరబీదలవేడియూర్పులం
మసమసవాగ్ని నీబ్రతుకు దగ్ధము సేయదె యొక్కపెట్టునన్.

తేటనీరము పైదేలె, దిగెను జిడ్డు
అడుగునకు; నెల్లకాలంబు నటులనుండ;
ఇంచుమించుల సరిదిద్ద నెప్పుడైన
విశ్వవిప్లవశక్తి యావిర్భవించు.

కాలమెన్నడు నొకరీతి గడపబోదు
తారుమారులు సహజంబు ధరణియందు;
అతిగమెక్కి యజీర్తిని అడలువాని
మొనవుటకు లేనివా డాక్రమింపవచ్చు.

ఎందరెందరో సరసాలు తేలినారు
మిసరు ఫారోహు కనుబొమ్మ మెరయుచుంటి;
సీజరుని బట్టతల నొంటి జేరియుంటి
కైసరులడాయిమీసాల గడలుకొంటి.

నాటినుండియు నేటికి నాకు పలియు
నట్టి రాజులు రాజ్యంబు లవనిలేవు;
అరసినంతకు నొక్క సత్యంబు గలదు
జనుల బాధించు నృపుని రాజ్యంబు గూలు.

ఈ ప్రబోధమెల్ల నితరులకేయని
యనకు, నీకుసైత మన్వయించు;
బరహితోపదేశపాండిత్యమనియెంతు
వేని, దాన నాకు హానిలేదు.

పదిపదునాల్గువర్షములపాటు కలంబునుపుట్టకే సుఖా
స్పదమును నిర్విచారమగు వ్యర్థపుసోమరిజీవితంబు నీ
కొదవెను; నేనుగూడ మొనయొత్తితి; నిద్దుర మేలుకొమ్ము; నీ
యెద జిగిరించుభావములకిమ్ము మనోహరరూపసంపదల్.

ఒకవేళం బదునైదువత్సరములన్ యుష్మ త్పురీపూరమిం
కకయున్నం బదివేలు; గాలిబయులం గంపించు దీపంబుగా
బొకొ జీవాత్మ; యుపజ్ఞచేసి యుపకారోత్సాహముల్ కాలహిం
సకు గాల్చాపితి, వింకనైన గవితాసాంగత్యముంగోరుమా.''

పలితకేశము నన్నిట్లు పలుకరించి
మరణభయము ప్రదర్శించి మందలింప
నిట్టు లంటిని నవ్వుచు: ''నెంత పెద్ద
వేత్త వైతివె నీబూది పెన్నుగలయ!

జననమొందినప్రాణికి చావు నిజము;
చావుచావని భయపెట్టలేవు నన్ను;
జాపకేయుండినన్ శిలాశాశ్వతముగ
దాతముత్తాత లెచ్చట దాగినారు?

మరణము భౌతికంబయినమారుపు; దానికి జింతయేల? యు
ర్వర ధనధాన్యభోగవిసరంబుల బంధుల నాలుబిడ్డలం
దిరముగవీడలేని యెదతీపులు వాంఛలు సందడింప ని
ర్భరమయితోచు మృత్యుపరిరంభము సత్యమెఱుంగకుండుటన్.

ఐన ననురాగసూత్రాల నలవికొలది
లాగినను త్రెస్సిపోవక సాగుచుండు;
కణ్వసంతతివానికి గరగె మనసు
అత్తవారింటికి గుమారి నంపునపుడు.

బాతు జలమున నీదియు బక్షములకు
అంబుబిందువు లెప్పుడైన నంటుకొనవు;
కార్యమధ్యస్థుడయ్యు నిష్కామకర్ము
డంటియుంటక యాశల నతకరించు.

నేను మరణింపబోనోయి, మేనె మడియు;
అదియు మొదలంట నాశనమగుటలేదు;
మొదటి యణుయోగమున మార్పులొదవె;
నంతె; కాటిబూడిదసత్తువ గరికపొదలు.

హిమశిలను నీరు నావిరి యిమిడియుండు
పగిది స్థూలాంగమున సూక్ష్మభాగముండు;
దృశ్యమూర్తినశింప నదృశ్యమూర్తి
మిగిలియుండును మనసుతో దగిలియుండు.

నాట్యరంగంబునం దెర నడుమ దింపి
మరల నెత్తెడునందాక తెరపియుండ
జరుగు కార్యములన్ని ప్రేక్షకులకంట
బడనియటు మరణోత్తరాశ్వాసములదు.

"మరణభయంబునాకు నణుమాత్రములేదు; మఱియుజీవనసంఘరణభయంబె యెక్కు'డని పల్కెను ఉమ్రఖయాము, దానిలో బరమయథార్థభావము ప్రపంచితమయ్యె; జగత్సమస్తలంబుం ఏ విషయమేక కనుమూసిన నయ్యవి విడిపోవునే ?

ఇష్టముండియొ లేకయో యే నియతినొ
చెదరిపడినార మైహికజీవితమున;
పరిసరంబుల కలవాటుపడకయున్న
నిల జనించినఫలము గ్రహింపగలమె ?

అన్నమో రామచంద్రయం చుపలువాడు
పరసుఖంబుల జూప సంబరముపడునె ?
ప్రాణికోటుల కన్నమావశ్యకంబు;
గాలిపిడికెళ్ల నెవ్వరి కడుపునిండు?

పుట్టిపెరిగితి; నొకకొంతపోయె వయసు,
ఈప్రపంచానుభూతి యంతింతొ కలిగె,
ఎన్నొ మాతాతముత్తాత లెరుగనట్టి
యంత్రతంత్రము లక్కరయయ్యె నేడు.

ఫోను రేడియో కారు విమానములును
వేగకాలదూరత్వ సంస్థితులమార్చె,
మున్ను కూపస్థమండూకములుగనున్న
యఖిలజాతుల భావైక్యమవతరించె.

రామరావణరణము, కౌరవులపోరు
సర్వనాశకముగ నేడు జరుగుచున్న
రూసుజర్మనుసమర నిర్యాసనమును
గడలిలో నీటిబుడగలకరణి తోచు.

ఇట్టివెన్నెన్నొ యనుభూతు లిలనుగలిగె;
బాల్యముననుండి యలవాటుపడుచువచ్చె,
జచ్చి పరలోకమున గ్రొత్తజన్మమెత్త
నలవరచుకొందు వచటిమర్యాద లిటులె.

పరము సత్యంబెయైనను బరముకొరకు
నిహసుఖంబుల బలియీయనేల చెపుమ
పరములేదని ఖయ్యాము పల్కెగాని
అట్టియుపకాశ మే నెన్నడపగనుంప.

ఇహపరంబులరెంట గ్రహింపగలుగు
నఖిలసుఖదుఃఖముల నేను అనుభవించి
పుట్టెదను మళ్లీ మా మాతృభూమియైన
భారతాఖండమండలభవ్యసీమ.

జాతి ముకుళితభావవిష ప్రయుక్తి
స్వార్థపరతంత్రమైయున్న సమయమందు
మరణభీతి దుర్వారమై మల్లడించు;
గర్వదాస్యంబు స్వాభావికముగ దోచు.

ఉపనిషత్సారసందేశ ముజ్జ్వలాసి
కరిసధారాతళత్తళల్ గలసి పారు
నమృతగీతస్రవంతి రూపందుకొన్న
ఆర్యభువి మృత్యుభీతి నింద్యంబుగాదె?

ఇప్పుడప్పుడె ముక్తి నే నిచ్చగింప;
ఎన్నికోటులయేండ్లొ యీపృథివిప్రజలు;
వేయిమార్లైన జన్మింప వీలుపడిన
బ్రతితడవ గోరుకొందు నీపావనోర్వి.

అన్నికోట్ల ప్రజలు బద్ధులై శ్రమింప
నేనుమాత్రము ముక్తి వాంఛింపనేమి?
అవయువంబులుకొన్ని దేహంబునందు
బ్రమపమొందునె మిగతవి బాధపడగ?"

అని పలుకగ విని వెంట్రుక
నను బరిహాసంబుచేసి నవ్వుచు ననియెం:
"గనుగొంటి నీదుకోర్కెలు;
మనుజుడు స్వర్గంబుగోర మానునటోయీ ?

యజ్ఞములుచేసి కర్మలనాచరించి
సురపతిని దృప్తిపరిచిన సోమయాజు
లెల్ల రంభాదిభోగినిపల్లవాధ
రా పరీరంభ కాంక్షులై రారె దివికి ?

తరళకిసాలకల్పక లతాసుమజాలముఁరాల్చు పుష్పాడిం
బొరలుచు స్వర్ణదీజలజపుంజములం జెరలాడి శీతశీ
కర పరిసేచనంబుగొని కమ్మనితెమ్మెర వేగుప్రొద్దులన్
నెరసెడు నాకలోకరమణీరజనిశ్రమతాపహారియై.

ధురమున గోపుతూపు వెనుదూయఁగ బాయఁగ లాగి దాని గ్ర
మ్మర నరి నేయు బాహుబలమాన్యులు శూరులుయుద్ధభూములన్
మరణమునొంది నిర్జరవిమానములన్ దివిజేరి జారిణీ
పురమున వాడవాడలను బొంచుదు రచ్చరపూవుబోండ్లకై.

గాంగసైకతముల వెరగంటిచెలులు
కాముకులగూడి చరియింత్రు కమలషండ
మండితోత్తుంగవీచిప్రకాండపటలి
శిశిరశీకరమౌక్తికశ్రీలు చల్ల.

అమరవనాంబుజాకరమునందు దిగంబరలైన యప్సరో
రమణులు క్రీడసల్పుచు తరంగములం జెరలాడఁగన్ సమీ
పమున మెలంగు కాంతులగపట్టు సరోరుహిణీకదంబ మ
ధ్యమునమొరంగి పుష్పనిచయంబుల గప్పెనరా రభిన్నతన్.

పొలుపుగ బూలు పాలవలపుల్ చిలికించుచు రెమ్మరెమ్మలన్
బలకొన, నల్లిబిల్లిగొని పల్లికలల్లులువెట్టుటన్ రహః
స్థలులయి, ప్రేయసీప్రణయదాస్యముగోరెడి వల్లభాళికిన్
నెలవులుగా సరోవరమునీటు రహించు లతాంతదీపముల్.

అంచబోటి సరస్తీరమందు మంద
మంద గమనంబునంబోవు చందమరసి
యచ్చరనెలంతనడక యొయ్యారమరసి
యించు మించుల దేల్పలే కేగు ప్రియుడు.

చల్లవెన్నెలగాయు ప్రశాంతనిశల
బూలతేపలపైనెక్కి పూవుబోండ్లు
కాముకులు తెడ్లువేయ గంగాస్రవంతి
జలవిహారమొనర్తురు చెలువమొలయ.

ఉంగరాల్దిరిగి లే బంగారునొసలిపై
దొరలు కస్తూరిముంగురులతీరు,
కాటుకచీకటిం గలసి రెట్టించిన
కడగంటి చూపుల కమ్మదనము,

పరికిణీ పలిపెంబుపయి వెల్లివిరిసెడు
   నొడలిచాయల దేటపడిన సొబగు,
చిగురాకువాతెర యెగబోయు కెంజాయ
   చెక్కుల బ్రతిఫలించిన పసందు

చెలువ మెండొండు పలరాచములికిగాగ
గాముకజిగీషతో రంభ కదలినపుడు
ఒక్కక్షణమైన బరికించియుండువేని
మరల భువి బుట్టు మాటలుమానుకొనవె.

హరిణీ, మనోహరి, చంచల
హరిణస్ఫుటనేత్ర, నందనారామమునం
దిరుగుచు బూవులుగోయుచు
మురియుచు హరియించు దబిసిముచ్చులమనముల్.

పలుకుపలుకున దేనియలొలుకుచుండ
నవ్వునవ్వున మాధురినివ్వటిల్ల
జూపుచూపున వలరాజుతూపుతేయ
గులుకులాడి తిలోత్తమ వలపుజూపు.

జరిపుత్తాణీపైట జలతారుపావడ
కుచ్చెళ్లు గుబురులై గునిసియాడ,
చెండంటి పరుగెత్తు చిడిముడిపాటులో
నోరపయ్యెద కాపుదారి సడల,
తలవెంట్రుకలు వీడి యెలదేటి తెరలట్లు
తరగలై గాలిలో దెరలుచుండ,
చిరుచెమ్మటలు ముత్తెసరులపోలిక చెక్కు
టద్దంబులకు వింత యంద మొసగ,

కాముకులగుండెనే చెండుగానొనర్చి
యాడుచున్న యా యూర్వశి యనునిమేష
భిన్నభిన్నాంగభంగుల జెన్నుచూపి
కొల్లగొను నెట్టిసంయమియుల్లమైన.

శాపానుగ్రహశక్తుని
కోపోద్దీపితమనస్కు ఘోరసమాధి
వ్యాపృతు విశ్వామిత్రుని
లోపరుచుకొనెఁ క్షణంబులో మేనకయున్.

ఎర్రగుట్టినగాలంబు నేసి చేప
లాగురీతి ఘృతాచి విలాసవీచి
ఎర్రవాతెరతరితీపు టెరను జూపి
యనువుకాంశ్ర యొడండల నపహరించు.

గోచిబిగియించి తపసులై కూరుచుండి
పవనపర్ణాంబుభక్షులై బ్రతుకుమునులె
యుచ్చరలమోహవాగురలందు జిక్కి
కలుచవారక నిర్ముక్తి గాంచినారె ?

ఏపన నెంత, నాకరమణీమణులయొక్కతె యోరచూపులం
జేవిరితో గపోలముల జిట్టకముల్ పచరించినొక్క మో
హావిలమై హృదంతరము, అంగము కాకరకాయచందమై
చేపవొలంగి వే పయుటచెంగును బట్టవె? రంగు చూపవే?

అమృతము పానముసేయుట
అమరులకున్ క్షుత్పిపాసలడగు సతంబుం
గమనీయభోగమొదవును;
కుమిలి జరామరణబాధ గుందరు వారుఁ.

ఆయు ఋతువశలేకమై యలరుచుండు;
రేలు కలనాళ్లు వెన్నెలపాలు చిలుకు;
దుఃఖమను మందుకేనియు దొరకదచట;
అంతరములేని ప్రణయసౌఖ్యంబులొప్పు"

అని యేమేమొ వర్ణిం
పను గుటికలు మ్రింగుచున్న పండితునెరకం
గని యంటి: "నీవు రూపిం
చిన యాజీవితము నాకు జీవరగొలిపెన్.

ముక్తివాంఛింతుగాని యామొగము మొత్తు
అమరపురి జేతికఱ్ఱతోనైన నంటు;
వలపుపస్తులు, కడుపుకొండలముగన్న
చెనటికవిగాడు దాని సృజించియుండు.

ఆ కవికి వివేకింప లోకానుభవము
లేకయుంట యథార్థమౌ; లేకయున్న
ఏకతానంబునన్ మార్పులేవిలేని
యట్టి కొరగాని బ్రతుకున కాసపడునె?

దుఃఖముండక సౌఖ్యంబు దేచు టెట్లు?
కాంతి యెటులూహ్యమౌను చీకటులు లేక?
తారతమ్యముకనుగొనపరమెమనకు
దుపకు సరిపోల్చ రెండువస్తువులు లేక ?

భూపతుల కోశములు కొల్లవోవ ధనము
గాంచి, మేకలజంపి యజ్ఞములొనర్చి
నేయి త్రావక మంటపాల్పోయుటెల్ల
దండులంజెలపడుకల బండుకొనవె ?

యుద్ధమునజచ్చివచ్చినయోధులచట
గత్తి డాలు డవాలుతో గండుమెరసి
వేల్పుచెలులిండ్లు ముట్టడివేయు, వృష్ఠ
సోమయాజుల కవకాశమేమియుండు ?

రూకుజర్మనుదురమున గోసయాక
తెత్తుసోల్జరి నొక్కని నెఱుగబోము;
అచట గోటానుకోట్లుగా నంతరించి
స్వర్గమునకు వచ్చెదరో యచ్చరలకొరకు ?

నెలలకాలము రణభూమినిలచియుండి
ఆడుమోమును గలనైనసరయునట్టి
మొరకసోల్దారిమూక నాముద్దుబోడు
లారుగురు ఎంత యెంతని యరసికొంద్రు ?

అలరులపుప్పొడింబొరలి యల్లనగమ్మనితావులీనుచుꠂ
మెలగెడు గాంగశీకరసమీరము వారి నిశాపరిశ్రమల్
పొలియజరించునంటి; వికబోటులతాపముదీర్ప గాద్రవే
య లయకరుండు రెక్కల నహర్నిశముం గదలింప రావలెꠂ.

భరములైతోచు నిట్టియుపద్రవముల
దెచ్చిపెట్టిన హిట్లరు దిట్టపోసి
పడుకతప్పించుకొనెడు నుపాయములను
అరయుచుందురుపో వేల్పుటతివలిపుడు.

అమరపురీవిహారముల నచ్చటి తోటల నాటపాటలꠂ
రమణుల యందచందముల రమ్యములౌ జలబాకరంబులꠂ
విమల వియజ్ఝురీచలితవీచుల, సైకతవీథులꠂ మనో
జ్ఞముగ వచించినాడ; వవి కంటికి గ్రొత్తలె భూతలంబునꠂ.

పుడమిపయి సౌఖ్యములులేని పూర్వకాల
మందు సృజియింపబడియె సురాలయంబు;
దాని నేటిప్రపంచంబుతోన పోల్చ
బ్రాబడినరీతిగన్పట్టు బ్రభవెలంగి.

నీవు నోరూరునట్లు వర్ణించినట్టి
వాసవపురీసుఖంబు మద్రాసుబీచి
యిసుకపరవులబన్నుంత నెదదొరంగు
హాయికంటెను గమనీయమగునె చెపుమ.

కరమువిశాలమై మెరుగుగారెడు తారుపథంబుప్రక్కపలం
పసువులు, పూలుపూచినలతావలయంబులు, తోటమాలి క
త్తెరమెదలించునేర్పుమెయి దీర్చినపూవులచెట్లరూపముల్
పరగునుదర్శనీయముగ బ్రక్క విహారముసేయువారికిన్.

కురులనుదువ్వి యల్లికలక్రొవ్వెదచుట్టరచించి, పూవులం
చురిమి, మొగంబునన్ వలచు ధూళులనద్ది, హిమంబలంది, చం
దురతిలకంబుదిద్దికొని, తొంగలిరెప్పలయోర గాటుకం
జరిమి, కరాచిచీరలపసందొలయం జరియింత్రుకోమలుల్.

హరువుగ బాహుమూలములకవ్వల సంతమునొందు 'బ్లౌజు' త
త్పరిసర మోహనప్రకృతి దాపక చూప, నిగారిపైటచెం
గరవిరి చన్నుచట్టునగమందునసెక్కొని పన్నుబాధతో
పెరలకయుండ బాటునదతీయునపత్తును కొంపరంగనల్.

జలజకర్ణికజుట్టు కింజల్కములటు
వెనుక జుంజురువెంట్రుకల్ గునిసియాడ
ఆడుమగతనంబులునేకమైనపడుచు
వెదలు పెరచాపలె త్రినపడవపోలె.

ఘాంకృతులతోడ మోటార్లువచ్చినిలువ
సొగసుసరకులు బీచికి దిగుమతియగు;
మునలిమగని రక్షణము వెక్కసముగొలువ
ఊర విడిపడి మున్నేగు యువతి యొకతె.

అరుణుడుపశ్చిమాద్రిశిఖరాంతరుడైన రథాంగయుగ్మముల్
విరహముసంబరస్ఫురమువేచుచురోసెడిభంగి ప్రేయసుల్
తిరుగుచు గుర్తుపట్టులబదేపదిచూచి నెలంతరానిజా
డెరుగక దారిబోవుపెరయింతులజూతురు కాంతకోసమై.

మగలపరియించు చదుపరిమగువలకును
యువతులంగోరు విద్యార్థియువకులకును
వలపుపందేరములుపంచుతలపుతోడ
రతిమగండువసించు మద్రాసుపురి.

ఎల ప్రాయపుంగొమరె లాప్తులపొంతల బీచి కాపిహో
టలినుపవిష్టలై తినుబెడంగుతెరం గరకంటజూచి క
ప్పులనెలకొన్నకాపియల పూపులవిల్తుని మావిగుత్తులన్
జలజలనుట్టుతేనియల జాలనిక్రోలుదు రచ్చటన్ యువల్.

మిసమిసలాడుపర్ణములమీనము లా జలజంతుజాల గూ
ర్చిన పెనుగాజుకొప్పెరల జెన్నొలయుం జరియింప, పమ్మిగాం
చ నచటకేగినట్టి యెలనాగలచీరల వర్ణసంపదల్
తనువులబింబితంబయి ప్రతారణచేసెననంగ సొంపిలున్.

కాలేజి విడుపలగాంచుటేతడవుగా
సలపోక నడుగు విద్యార్థితుటుము,
పగలెల్ల లేఖినీబాంధవ్యమునబుచ్చి
యూరడవచ్చు నుద్యోగిజనము,

ఆలుబిడ్డలకుఁబోడయి రేడియోవిన
    నల్లననేగు గృహస్థుగణము,
పట్నంబువచ్చిన పనుతెల్లముగిసిన
    హాయిగాదిరుగు పరాయిజనము,

కదలితరగల తుంపురుతడినిమోచి
మేన జందనములదు తెమ్మెరలువీవ
చిగురుటిసుకలబన్నుండి సాగియుచుండ
అమరలోకసుఖంబేల యాసపడగ ?

గాలికిం బెలరేగి లోలమై కెరటాలు
    తుంపురుముత్యాలు తొలకరింప,
వెరచాపలెత్తినతెపలు రాయంచ
    లంతలై యలలఁద్రుళ్లింతలాడ,
సంజకెంజాయలు జంపుగా బింబించి
    పధిరాబ్ధి గగనసారూప్యమంద,
వెలుపారి తూర్పు మిన్నులువడ్డపట్టున
    శీతాంశుబింబంబు జేవురింప,

పగటి పరుసన మెలమెల్ల బిగివిసడల
జల్లవెన్నెల తెల్లిడ సల్లుకొనగ
నవ్యరసవాద పరివర్తనంబుగాంచి
టీచి మోహనదృశ్యమై గోచరించు.

చంద్రబింబమునుండి యా జలధితటము
వరకు వజ్రాలరస్తాను పరిచిరనగ
భంగముల బండువెన్నెల ప్రతిఫలింప
గడలికొక క్రొత్తయందంబు గడలుకొనును.

తారకల తోరణంబులు బారుదీర్చి
దారికిరువంకలం గట్టినారొయనగ,
జారువిద్యుత్ప్రదీపికా స్తంభరాజి
కృత్రిమసుధాంశుకాంతి రహింపజేయు.

ధరపయి నూత్ననాగరకతావిభవంబులు యంత్రసృష్టి య
బ్బురముగ వృద్ధిచెంద, నెటువుట్టెనొయట్లుతె స్వర్గముండె; స
త్వరముగదానిలో నభినవంబగుమార్పులుసేయకున్న నా
క రమ ధరామనోహరతకంటె గృశించు గ్రమక్రమంబుగన్."

"ఇన్ని దంబాలుగొట్టితి వింతసేపు
జరమృతినిబాపు నమృతరసంపుటూట
కల్పతరువు చింతామణిగలదె మీకు?"
అనుచు వెంట్రుకప్రశ్నింప నంటినేను.

"అప్పుడొకఁడు విశ్వామిత్రు డవనియందు
సృష్టికిం బ్రతిసృష్టి రచించెనంట;
నేడుజరుగుగృత్రిమసృష్టినేర్పుమెయిని
సకలదేశ రసాయనశాలలందు.

శాస్త్రవిజ్ఞాన మద్భుతసరణి బెరుగ
మానవుడొనర్పలేని దేదేనిగలదె?
మచ్చుఁగోవుల జీవాణుమార్గమరసి
చేతనము గొన్నియేండ్ల సృజింపగలరు.

స్వర్గము నధఃకరించి మీచోటనేల
జుక్కలంటగ బైకెత్త జోద్యమయ్యె;
నాక మొల్లపయేని యానరకమొకటె
మిగిలియుండు; నదే నీకు దగినతావు.

జ్ఞప్తిచేసితి వన్నఁటె సమయమునకు,
వాంఛ గలదోసి నాకును; స్వర్గమందు
నిష్క్రియాజీవితముకంటె నిరయమందు
సత్యమార్గప్రచార సంసక్తిమేలు.

ఇచటిపల్లేరుగాయలు, నిచటినూనె
యిచటి మొసళులు పాములు వృశ్చికములు
ఎప్పుడెట్టులనచ్చోటికేగెనన్న
విషయపరిశీలనముచేయ వేడ్కగలదు.

అదియే కాదు, మహాకఠోరతరశిక్షాభీలదౌష్ట్యంబునం
జదుమై కష్టములొందు నానరకవాసుల్ స్వప్నబంధంబులం
జెదుమఁగలేక నిరాశులై యమభటోత్సేకంబుసైరించి యా
పదలం బొందెడువార లాత్మబలవిస్ఫారంబు నిద్రించుటఁ.

మధ్యయుగ నిరంకుశచోర మండలేశ
వికృతశిక్షాస్మృతిప్రతిబింబమైన
నరకరాజ్యంబు, ప్రజలు విజ్ఞానకాంతి
బడయువరకు బునాదులు సడలకుండు

ఆత్మకృతమోహనంబున నంధులగుచు
దరళపారాణికాశయతంతుజాల
జాలమునజిక్కి వెలువడు వీలులేక
పసిడికాయము బుఱుగట్లు పట్టువడిరి.

నరకమునకేగి యుచటి మానవుల కొక్క
చిరరహస్యంబుజెప్పిన, జిదుగుబొదల
నిప్పుపడి నాలుకలుచాపినెరయునట్లు
ఒక్కక్షణమునవిప్లవంబుద్భవించు.

కాలుడను భీకరాకృతి కల్పితంబు;
భావమాత్రక, మదిగాలిప్రతిమసుమ్ము;
పిట్టలనడల్ప జేలలోబెట్టినట్టి
గడ్డిబొమ్మకు మనుజులుకలగనేల?

కాలమనుమాట కొకరూపుకట్టిపెట్టె
వైదికకవీశు; డదియెంతొవండయయ్యె;
మరి పురాణయుగంబున మల్లడించి
సర్వభీకరుడయ్యె బ్రసన్నముఖుడు.''

అన విని వెంట్రుక యిట్లనెః
"వినవయ్యేను వెర్రిమొర్రి వేదాంతంబుల్;
మనుజులకు నిటుపచించిన
మనమున విప్లవమురాక మానునె చెపుమా.

స్వర్గనరకంబు లొక్కటి బాడుపడిన
దానధర్మముసేయు నుత్సాహముడుగు;
ప్రజలలో బాపభీతి యభావమైన
న్యాయసత్యంబులకు నాశ్రయంబు తొలగు."

"అదిగొ బూచి నిద్రింపరో రన్న యనుచు
జనని చిచ్చిగొట్టిన బిడ్డ కనుమొగుడ్చు;
ఉగవెలిసి పెద్దపెరుగ వా డుదరిపడునె?
చంటిపాపల వెరపులు శాశ్వతములె?

ప్రజలభయపెట్టి కపటతంత్రములచేత
బనులదోతెడుపగిది నిర్బంధధర్మ
దాస్యమునద్రోయుకంటె సత్యంబుతెలిపి
స్వేచ్ఛతో ధర్మమొనరింపజేయ మేలు."

నాపలుకులు విని వెంట్రుక
రాపాడ కనిష్టమైన రాజీపడియెఁ;
"ఈ పెడదారుల నొరులకు
నీపుణ్యము, తెలుపబోకు నిష్ఠురమొదవుఁ."

అని వచించెడునంతలో సతివపచ్చి
"అరరె! యిదియేమి యింకను బుసుసుబెట్టి
గడ్డమునురుద్దుచున్నారుగంటలైన;
దెల్లగాగిన వేన్నీళ్లుచల్లపడియె.

గొరుగుకొనపలయు విషయము
మరచితి; రన్నట్లె మీకు మతిభ్రమియించుఁ;
విరమించి పగటికలలను
గొరుగుకొనుండయ్య మీకు గోటినమస్సుల్."

బరబర జంకక గొంకక
పరివాపనముం బొనర్చి పదపద మంటిం;
జిరునవ్వునవ్వి యింతటి
త్వరయాయని యెత్తిపొడిచె దరుణియు నన్నుఁ.

[ భారతిలో ప్రకటితము: 1942 ]

కనులటులెత్తి నే గిటికికమ్ముల సందుల జూడ, దూప్పుకొం
డను నవమోహనాంబుద పటంబులపై లిఖియించికొన్న నూ
తనజలవర్ణచిత్రముల దర్శనశాల నమర్చి, చూడరం
డనుచు రసజ్ఞులం బిలుచు నప్పుడు రమ్యపికార్భటీ మిషన్.

కరుణాపాత్రుడ వీవు భాస్కరుడ, యొక్కండుం ద్వితీయార్థి క
ద్భుర వర్ణాంకిత చిత్రశిల్పముల సొంపున్ నిల్చి వీక్షింప; దం
బరమార్గంబున గ్రుంకు మెట్టునయికిన్ మార్పించు నీశాల; న
గ్గిరి నేయుకుడె యేపరూపినియు కాంక్షించుం గళాస్పృష్టులన్.

అనుదినముం బ్రదోషసమయంబున బ్రొద్దున వేయిచేతులం
బనిగొని వర్ణపత్రికలు వ్యర్థముగా క్షణక్షణస్వరూప క
ల్పనల నలౌకికాకృతుల బంకజమిత్ర, యయాచితంబుగం
బొనరిచి నీ యపూర్వకళపాటవము జుల్కనసేయ పాడియే ?

అడుగకమున్న లభ్యమగునద్ది యమూల్యమెయయ్యె దానినిం
బొడగనినన్ నిరాదరముపుట్టకతప్పదు; చిత్రశాల పె
న్గడిగొనునాళ్ల మూయుము; గనంబడు నక్కర, లేనినాడు; ని
మ్మడియగు ప్రేమయున్ విరహమధ్యమయేని స్వభావసిద్ధమై.

అని వచియింప నేను, రుచిరారుణమూర్తి పసిండి క్రాగుమూ
సను బురణింప బేశల లసన్మృదుహాసముతోడబల్కె నో
మనుజుడ, స్వార్థతత్పరులమానసమెప్పుడు లాభకాంక్షతో
బెనగొను; త్యాగజీవనము విస్మృతమయ్యె ధరాతలంబునన్.

మనుజునకింతగర్వ! మొకమర్త్యుడవీవు; అనంతసృష్టి నీ
మనుగడ నీవు నెంత? అణుమాత్రముబోల; వమేయతారకా
గణభరితాంబరంబున కఖండజగత్తునకేను చక్రవ
ర్తిని; గ్రహముల్ నిరంతర పరిభ్రమణంబున నన్నుగొల్చెడున్.

నేనులేకున్న భువన మంధీకృతంబు;
చేతనప్రపంచమునకు జేటుమూడు;
చంద్రుడాది గ్రహంబులు సరణిదప్పు;
ఇరుసువిరిగినబండినా నొరగు జగతి.

ఈయనంతసృష్టికి మోదమెసగజేయు
వ్రాయుచున్నాడ నాలేఖ్యపటములెపుడు;
కౌతుకమ్మునుగూర్చు నిష్కామకర్మ నాది;
అట్టి నాకు నీ కనికర మవసరంబె ?

చీకటిరేయి గొంతవయిజేరి యొకంత నగణ్యతారకా
నికము వ్రేలు శాంతమగు నింగిని జూడుము, నన్ను జూచుకో
మ్మోకవి, నియమిత్వ మటు నూహకు దట్టు; ననంతరంబు గ
ర్వాకులచిత్తవృత్తి కిసుమంతయు గారవమందదెన్నడున్.

నిటుపురుపులు చేపలు నిఖిలజలచ
రంబులును జెట్టుచేమలు ప్రబలఖేచ
రములు మృగములు సృష్టిలై ప్రాతవడిన
పిదప మనుజుండు పొడసూపె బృథ్వియందు.

జలజహితుండు ఈగతి బ్రసంగవశంబునబల్కి గోపసం
జ్వలనముఱేగి మానవయశంబె తృణీకృతమైనయట్లు లో
దలచి యిటంటి : నీకు నిది ధర్మమె మా నరజాతియున్నతిన్
మలినపడంగదూరెదవు; మానవు డాద్యుడుగాడె జీవులన్.

తిరుపతికొండనెక్కి పురిదిక్కునఁజూచిన గ్రింది గుళ్లు గో
పురములు బొమ్మరిండ్లటు లపూర్వనవాకృతిఁదోచు; మింటిపై
నిరతముసంచరించుటను నీ కగపట్టు హిమాలయుం బిలం
బరిచిన మల్లుదుప్పటము భంగి; మనుష్యుల మాట చెప్పనా!

సత్యమహో, గ్రహనక్షత్రచక్రమునకు
అక్షయంబౌట యాయుష్కిరణంబు;
అయినను గాలిచెంతంత యగ్నిగోళ
ములుల గన్పింతువిపు మాయకులకును.

కేతుగ్రస్తుఁడవౌదువు;
పాతరలాడెదవు మింటబరతంత్రుఁడవై;
నీతున రుజకుం జిక్కదు;
యాతాయాతశ్రమార్తి నడలెద వెపుడున్.

గురిగింజసామెతయ్యెను
నరసృష్టినిగూర్చి నీవు నాకు వచింపన్;
నరి! శిల్పివగుటకంటెను
చరితాధ్యాపకుఁడవౌట చక్కఁగనుండున్.

మనమున కజీర్తి హెచ్చిన దినమునందు
పత్రికలల చిత్రంబుల వేయు దొర!
నీకును రవీంద్రసత్కవి నేర్పినాడొ?
లేక నేర్చెనొ నీ చిత్రలేఖనంబు?

నా పలుకులు విని సూర్యుడు
కోపమురానీక లోనగొంపలపడకే,
పాపము! క్రూరుడు సజ్జుడు
తాపమునకుడగపటున్న తలపుదొలంకన్.

ముసిముసినవ్వు లెంతరలు మోమున, గన్నుల నెల్లిపంబునుం
గనిమునగంగ నాపయి నొకానొక మోయుపు జూపునైచి, మా
నినుల సమస్తతత్త్వమును నీవలనం గనుగొంటినోయి, వె
క్కసమును బ్రీతి మెప్పు నుడికారము నింపయి మాట,గాలికిన్.

క్షణమునకుమున్ను నా శిల్పకౌశలంబు
పొగడి మెచ్చితి వింతలో దెగడు టేల?
మూఢభక్తులు సత్యంబు ముట్టలేరు
మనసు ఊసరవెల్లి మీ మానవులకు.

నన్ను వేపింపదలచెనో, కన్నుగుట్టి
వేడ్క చూడంగ దలచెనో వెఱ్ఱితరణి
కొరవికట్టైను ఎదలోన గులికినట్లు
హత్యసేయంగ బోయినయట్లు పలికె.

కట్టకడసృష్టినయుడన్న గనలనేల ?
యింక నొక సత్త్వమూర్తిని ఎరుగుమోయి,
వేనవేలేండ్లక్రిందట విపినచరము
లైన కోతులసంతతి యవని జనము.

శీతవాతోష్ణములు మార్పుచెందు కతన
బ్రకృతిసర్వంబు కాలానుబద్ధసరణి
మనము కనరానియటు రూపుమారుచుండు;
అట్టి పరిణామఫలమె యీయిట్టి నరుడు.

తలపుగుబ్బకు మోచేయితట్టుకొనగ
గములు పచ్చగబోయెడికరణిదోప
పిడుగడిచినట్టు లీమాట వినినయంత
గొంతసేపు నిశ్చేష్టత గూరుచుంటి.

మతియొకయింతతెప్పిరిలి మాంద్యమువాయ, నెడంద యగ్నిప
ర్వతశిఖరంబునా బొగలువారుచు మంటలుగ్రక్క, సూర్యుడున్
వెతీయుసుమంతలేక సనువింతగజూచి హసింప, బెట్టురోల్
ప్రతిశిఖిపైన జారినటు రోషము తాపము మల్లడింపగన్.

ఇనుడనియును ఘనుడనియును
దినమణియని సర్వసాక్షి దేవుండని నా
మనమున దలపక మానవ
ఘనతన్ నిలబెట్ట బలుకగడగితి నిటులన్.

గౌరవ మిచ్చిపుచ్చుకొనగావలెగాని యదెంత మీకు మా
వారు ఋషుష్టులైన నొకపాటి ప్రియంబునుజూప కిట్టి న్యా
క్కారములాడి మాయశము గార్కొనజేయుదె? తిన్నయింటి కం
గారముగొల్పు నీచుడవు; గాములరేడెటులైతొ వింతయౌ.

నీకుశలంబు పెంపొందవ నిత్యము సంజ ప్రదీప్తపూరుముల్
ప్రాకటభక్తి మ్రొక్కెదరు; భవ్యుడవంచును విష్ణువంచు స
త్యాకృతివంచు వేదములు లంచితరీతి నుతించుచెల్ల ని
న్నాకమలాప్త! దానికివియౌనె కృతజ్ఞతచూపు మార్గముల్.

బురదంబడ్డ చిరత్నరత్నమునకుం బోబోదు మూల్యంబు; ని
ష్క్రియావృత్తి సమస్తమానవమహాసంఘంబుదూషించినం
దరుగంబోదు తదీయగౌరవము; నిదొష్ట్యంబు లోకంబునన్
స్థిరమౌకంటె మరేమిలాభములు సిద్ధించున్ వృథావాజిత్రథ?

నిన్నును నన్నును లోకము
లన్నియు సృజియించినట్టి యంబుజనాభుం
డిన్నరరూపమునొందిన
సన్నలొ నీకెఱుకపడని సంగతి పోచున్.

ధర్మముడుగంటి దుర్నీతి హెచ్చ నొకట
గలసి లోకంబు పాపపంకిలముగాగ
ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి
మానవాకృతిగైకొను మాటనిజమె?

తన రూపమునకు బ్రతికృతి
యన మనుజునిసృష్టిచేసె నాదిమదేవుం
డనియెంతు; బ్రాణికోటుల
మనుజుడు మేదావి నేప మాన్యుడుగాడే?

బుద్ధుడును క్రీస్తు మహమదు మొదలుగాగ
నెందరాచార్యులో జన్మమందిరిలను
అట్టి మహనీయులందఱు నధమమైన
కోతిసంతతియని చెప్ప గొంకులేదె?

మనుపటినుండి మానవసమూహముగాంచిన యున్నతస్థితుల్
పొసరించినట్టికార్యముల పూర్వమనోబలసిద్ధులుం, జిరం
తనమగు దేశనాగరికతల్ బహుశాస్త్రసమార్జనంబు జె
ప్పను బడియేండ్లుపట్టు; బృథివిం గలదంతయు జెప్ప సాధ్యమే?

వినికిమాలకారకులు విశ్రుతబుద్ధివివేకపూర్ణవి
ద్యానిలయుల్ సమర్థులు సుదారగుణాఢ్యులు పూజ్యులైన మా
మానవప్రతేగదా, తెలివిమాలివచించితివింతసేపు నో
భానుడ, చాలుచాలు, నికబల్కకు మేల వృథాప్రయాసముల్?

అన విని భాస్కరుండు మదియందుగలంగక నిందుకుండనా
దొనకక యెత్తిపోటులకు దుందుడుకొందక కన్నుబిడ్డ వా
కొను పలుకుల్ సహించు జనకుండటు మన్ననచేసి పల్కె నో
మనుజకుమార, సంక్షుభితమానస మారయవేదు సత్త్వమున్.

అన, సూర్యుని శాంతంబున
కును నా మిడిమిట్టిపాటుకును లో సిగ్గున
గొని వెరగుచెంది శాంతిలి
వినయము యత్నమునగాంచి వింటిని దుడకున్.

తాతకు దగ్గులు నేర్పెడు
రీతిగ భూలోకచరిత ప్రేలితివరరే!
మీతాతాతంత్రుల క
జ్ఞాతములౌ విషయముల ప్రసక్తియొనర్తున్.

ధరణి పుప్పుడివేల వత్సరములపుడు
వడలె మనుజాటవికజీవనము మొదల;
నాటనుండియు నేటికి నాగరికత
లెన్ని, రాజ్యంబులెన్ని మోసెత్తి నమసె!

అదియె యొక గొప్పగా జెప్పనేల నీవు
బిందువంతౌను విశ్వజీవితపయోధి;
వృత్తమును నాదుపుట్టుపూర్వోత్తరముల
వయసు విన్న నీ వాశ్చర్యపడుదు వేమొ.

కూపస్థంబగుమండుకంబునకు దిక్కూలంకషాంభోధివే
లాపర్యంతజలావకాశమునుదెల్పన్ దుర్లభంబౌను; న
ట్లాపద్మప్రభవాండసంచరణనిత్యానిత్యయాదృచ్ఛిక
వ్యాపారంబులెరుంగ నీకుదరమే పల్మారుబోధించినన్.

అరయన్ నీకు స్వదేశ, మంత బరదేశానీక, మాపైని సా
గరవేలావలయాకృతోర్విని గనంగావచ్చు; నాదృష్టి దు
స్తరవేఘాంతకటాహమంతటను సంసర్పించు; నట్లౌట ని
ద్దరకున్ వృష్టుల జీవితంబుల విభేదంబుల్ నిరంతంబులౌ.

నావయసెంతో తెలియునె?
నా విని, తల యడ్డమూప, నవ్వెను రవియుఁ;
మీవయసుచెప్పి యవ్వల
జీవితముంగూడ నాకు జెప్పుడ యనినన్.

చెప్ప దేలికయయ్యు నీచిత్రగాథ
విన్నవారలు నమ్ముటయన్న వింత;
కాని, సర్వంబు జరిగినకథయెచెప్ప
అవగింజంతయత్యుక్తియైనలేదు.

ఎపుడు పుట్టితినోగాని యెఱుగజాల
మూడువందలకోటులయేడులపుడు
ఊగదెలిసెనన్నుజ్ఞాపకమున్న; దింక
బ్రతుకవచ్చు ద్రిశతకోటివత్సరములు.

మున్ను నీ వంత పొగడినభూతధాత్రి
పుట్టెనాకన్నులెదుటనే పూర్వమందు;
ఎవతెయానుసుసందేహమేలనీకు?
కంపలోగంప నా వయుగారిపుత్రి.

సుడిగాలి యొక్క పెట్టున
పడి నన్నొక యన్యలోకవాసులనడుమం
బడ రువ్వినట్టులయి నా
యొడలెల్లను గంపమొంది యూర్పుచునుంటిఁ.

తెరగన్నులు తెరసేదును
విరవిరతడియూపునాల్క వెరగుమునంబై,
వెరపుగొని పూర్వధైర్యము
తరుగఁ వినయంబు లోన వంపడిగొనగఁ.

జలజాతాప్తుని భక్తినమ్రమగు వీక్షామాల సేవించి యం
జలిబద్ధుండనుగా వచించితిని: ఓస్వామీ, జగత్సాక్షీ, చం
చలచిత్తంబున బ్రేలుచుండిన ననుఁ సంభ్రాంతు మన్నించి నా
కలుషంబుఁహరియింపుమంచు గరుణంగాంక్షించి ప్రార్థించితిఁ.

అజ్ఞానతిమిరనష్ట
ప్రజ్ఞుఁడనై యుల దివాంధభావంబున మీ
విజ్ఞానరోచిరుదయము
వజ్ఞత నరికట్టి హస్తపాత్రుడ నైతిఁ.

అని నే నీవిధి విన్నవింప గరుణాహాసంబు నెమ్మోమునం
బెనకఁ, నీవెప్పుడైన నామతము పొందుం బాడియుం గందువం
చనుకొందుం, వడవేల, నాచరిత నెయ్యంబార వర్ణించెదఁ
వినవోయీ, యని చెప్పసాగె హృదయావిర్భూతచిత్రంబుగఁ.

జనకజనయిత్రిభావముల్ సమతగలసి
యర్ధనారీశ్వరంబైనయాదిశక్తి
ప్రకృతిపురుషసమ్మేళనభవ్యమూర్తి
విశ్వజనని వర్ధిల్లు దుర్వీక్ష్యకాంతి.

ఆమహామాత యగ్నిగోళాండములను
పెట్టె, నం దొక్కటొకటియు బ్రిదిలి భాను
బింబములుపుట్టి యాకాశవీధికెగసె :
అనుజులందరలో నేన యల్పతనుడ.

అన్నల నొక్కడొక్కడు మహాద్భుతశక్తిసమున్నతాత్ముడై
మిన్నున సర్వసంపదలమీరుచు రాజ్యములేల, నీవు ఈ
తెన్నున బొల్లుగింజవయి దేనికినెక్కకయుండగాంచి నా
కన్నులుకాయుగాచె గొడుకాయని తల్లి సడించు మాటికిన్.

అదియటులుండ, నాయొడలియందు వికారపు సల్లముచ్చలుం
బొదలిన జూచి "యమ్మ కడుపుం జెడబుట్టినవాడవంచు" న
న్నదపదపెట్టి కాలొడిసి యంతనె గిర్రని త్రిప్పిత్రిప్పియుం
జదలున బైకిబోవిసరె జండసమీరమురేగిచుట్టగన్.

ఆదుర్వారమహోగ్రదిక్ప్రళయవాతాలోల కాదంబినీ
ప్రాదుర్భూత తమఃపరంపర దిశాభాగంబులంగప్పె; ను
ల్కాదండంబులు బాణవేగమున రాలంజొచ్చె; నక్షత్ర ధూ
ళీ దిగ్భ్రాంతి చెలంగె; నింగి రొదగొల్పెం గ్రిందుమీదైనటుల్.

మనసాతీత మనోజవంబున నభోమార్గంబునం బోవుచో
మును నం దాకిన తారకల్ పగిలి దుమ్మ్ముం ధూళిగా రేగి నా
వెనువెంటం బరతెంచ, జాడవడియె౯ విస్వీథి స్వర్గంగ మ
త్తనుసంతాపము వాప శీతజలపాతంబై సమీపించెనా౯.

అప్పటి నామనోనుభవ మద్భుత మేమని చెప్పవచ్చు! నే
నుప్పర మేగునప్పుడు నుడూత్కర మెయ్యెన గ్రిందజారున
ట్లొప్పెను; పోవపోవ బయి నోరల గ్రింద నమేయగోళముల్
గప్పిన యంతరాళము వికస్వరమై కనువింపొనర్చెడు౯.

వారణము వారిమగ్న కుంభస్థలంబు
నెత్త, పలయుంబు క్రమవృద్ధి నొత్తినటుల
పైకిజనుచుండ, మిన్నులువడ్డచోటి
పరిధి, వామనరూపంబుపగిది నెదిగె.

పుష్కలావర్తకంబులు పొదలినట్లు
తారకాధూళి మొత్తమైతనర, నందు
సుడితుపానులు లోలోన సుడిసిరేగి
ప్రథిత నటరాజ తాండవ భ్రాంతి గొలుపు.

తేలెడుతెట్టెలౌ పగడదీపులన్ మెలమెల్ల దారకా
జాలము లేడకోఁ చనెడుజాడగనంబడు; దోకచుక్కలు
వ్వేలరయంబునన్ గగనవీథి గ్రమించి నటన్మయూరపిం
ఛాలయ పుచ్ఛవిభ్రమము లన్నిదెసల్ ప్రసరింపజేసెడిన్.

తెలుపు పసుపును నెరుపు లేమొలక నీలి
రంగులం బొల్చు తారలు నింగి వ్రేల,
మాపు, బహువర్ణ విద్యుత్ప్రదీపికలను
అందగిలు పెండ్లిపందిరి యనగ దోచు.

ప్రళయవాత నిరంతరావర్తమందు
దోకచుక్కదగుల్కొనితొలగలేక
తిరిగెనస దారకారాశిదిరుగుచుండె
నుల్కలం గురిపించుచు నుప్పరమున.

పంక నిర్మగ్నమయి లేవ వలనుపడక
ధూమ్ర బృహదశ్వ మొక్కటి దోచె మింట;
దాని దప్పింప క్షమమైన దడవులేక
యతుల జవమున బైపైకి నరుగుచుంటి.

నిలువక కొంతకాలమటు నే బయికేగుచునుంటిగాని యు
జ్జ్వలదుడుఖండమండలనిబంధమునంబడి చిక్కుకొంటి; ఆ
స్థలము పరిక్రమింప బలదర్పముచాలమి గొంతకాల మా
కులపడి దారిచేయుటకు గుమ్మరిసారెగతిన్ భ్రమించితిన్.

పరిసరధూళి మేఘములుపాయులుగాబరికీర్ణమౌచు లో
బిరివిడి మత్తనుభ్రమణవృత్తమునంబడి భీషణాగ్నికిం
గరగి మదీయదేహమునుగ్రచ్చుకొనంగ, దదాదిరాశి దు
ర్భరమయి యున్నయట్లు బలవంతుడనై యభివృద్ధినొందితిన్.

ఇట్టులుండగ నాకన్న నెన్నిరెట్లొ
ఘనతరంబగు తార నాకడకురాగ
మించుభయమున మేనుకుంచించియొదిగి
గతుకులోబడ్డ బండినా గదలిపోతి.

బొదబొదగా లొదలొదగా
కదలెడు నాదేహమందు గణుతలుపుట్టెన్;
ముదిరి యవి పెద్దవాయెను;
కుదుటును మెయి తూకువాసి గునుకుచునుంటిన్.

భ్రమణవిస్తారవేగదుర్వారహతికి
గణితలెల్ల పృంతచ్యుతిగాంచి చెదరి
బహుళదూరంబునంబడి భ్రమయుచుండె;
అక్షమునుజక్రమటు నన్ను నాశ్రయించి.

అందునొక్కటి మీపృథ్వియౌ గుమార;
కాని, దానికి నొక పెద్దకణితపుట్టె;
అదియు గాలక్రమంబున ముదిరి, వీడి,
సోమబింబంబునా భువిచుట్టు దిరుగు.

ఇవి యెల్లఁ రచియింప గొన్ని నిమిషాలేయైన, నెన్నెన్ని కో
ట్లవు వర్షంబులుచెల్లె దద్విషయముల్ సొంతంబుగా సృష్టికాన్;
కవి, నీభావవిహారఖేలనము విఖ్యాతంబుగాసాగ గ్రొ
త్తవి విశ్వాద్భుత దృశ్యమార్గములు మోదస్ఫూర్తిసూచించితిన్.

మాటాడ దలచియును నా
నోటనుదడిలేక యడ్డునుడివిన నేమో
లోటగు ననుకొని వెరగుం
పాటున రవిజీవితంబు బాయకవింటిన్.

విని యిటు లంటి : నోప్రభువ, విస్మయచిత్తుడనైతి మీచరిత్రనువిని విశ్వదర్శనము తన్మయతంగలిగించి నామనంబున నవవిజ్ఞతాంకురము మొలిపజేసెను; మూఢభక్తిపర్తిని త్రుటిమాత్ర సత్యపరిధిన్ నిలబెట్టితివయ్యా భాస్కరా.

ఐనను సంశయములు నా
మానసమున సంకురించె; మనవి యొనర్తున్;
భానుండొకడేయని యా
మానితుడున్ మిరెయని భ్రమం గొనియుంటిన్.

మీమాటలు విన్నంతట
వ్యామోహము కొంత వెలగె, నైననుగానీ
వ్యోమము గాలించిన ది
క్సీమల బరమాత్ముడెవడు చిక్కడు దృష్టిన్.

నీదు సందేహమున గొంతనిజముగలదు;
ఈ ప్రపంచమునకు నేన యినుడనౌదు;
తక్కుభాస్కరు లూహింపదరముగాని
దూరముననుంట జుక్కలై తోచుచుంద్రు.

వారిచుట్టును గ్రహములు భ్రమయుచున్నె?
వారలకు నిట్టిధరణులు ప్రజలుగలరె?
అందరర్కుల గుక్షిలోనణచుకొన్న
విశ్వకర్పర మదియెంత విస్తృతంబొ!

చాలసూర్యులేకాకులై సంచరింత్రు;
కొందరనుజుట్టి గ్రహము లందందుదిరుగు;
ఉష్ణమనుకూలసిద్ధమైయొప్పుకతన
ప్రస్తుతము ధాత్రి గొనసాగు ప్రాణిసృష్టి.

వసుధసంతట నెందరుప్రజలుగలరొ
అన్ని తారకలొప్పారు నాకసమున;
పాతతారలు చల్లారి భస్మమైన
గ్రొత్తతారలు పుట్టు నేకోణమందొ.

విశ్వవైశాల్యమింతని విశదపరుప
వలనుపడబోదు నావంటివానికైన;
నిఖిలసౌరకుటుంబముల్ నియతిలేక
చెదరజల్లినవిధమున గుదిరియుండు.

అరయ, నిరువదిలక్షల యంతరీప
విశ్వములుగాఁగలు బ్రహ్మాండవిపులకుక్షి;
నందు నొకదీవి నారాజ్యమౌ గుమార,
యితరదీవులకిట్టులే యినులుగలరు.

*మనకు దగ్గరగానున్న యినునిరశ్మి
ధరణిఁజేరంగ నైదేండ్లుజరుగవలయు;
దూరతముతైనసూర్యుల దొరగుకాంతి
ప్రాఁకు బదునాల్గుకోట్లవర్షములనిలకు.

ఎనిమిది నిమిషంబులలో
ననయము మత్కాంతి భూమికరుగుచునుండుఁ;
గనుగొనుము పోల్చి యెంతటి
ఘనవిస్తృతిగలదొ విశ్వకర్పరమునకుఁ.

ధరణికన్న నే దశలక్షలతరములెచ్చు;
మరియు నాకంటె దశలక్షతరములెచ్చు
గలుగు నెన్నెన్నొతారలుగలవు చదల;
అనగొనయుతేని యీసృష్టికంతులేదు.

* కాంతి ఒక సెకండునకు ౧౮౬౦౦౦ మైళ్లదూరముఁ బ్రసరించును.

ఇది యెట్లు సంభవించును?
మొదలుం దుదిలేని దొకటి మొనయునె? శంకా
స్పదమగు మీమాటలు; న
య్యది యెటులూహింపవచ్చునన, రవి యనియెన్.

ధారల్ పుట్టును, వచ్చి భస్మమగు; దద్భస్మంబె వేరొక్క యా
కారంబుంగొని నూత్నజీవనముతో గంపించు; గల్లోలిని
పూరం బింకియు బాష్పమై జలదమై పూరించు వర్షంబు; ని
ధారిన్ విశ్వమనంతరజ్జువటు నిత్యంబై భ్రమించుంగదా.

స్థితియు రూపంబు మారును జేటులేదు
అసలువస్తువునకు నెప్పు డరయుమోయి;
మంటిగోడ వానగరంగి మన్నుగాగ
అదియె పరగృహనిర్మాణమందు నొప్పు.

సృష్టిలేని క్షణంబు నూహింపలేము;
విలయముండని త్రుటిని భావింపలేము;
ప్రతినిమేషము భిన్నాంబుపూరమగుచు
బారు జీవనదియగు విశ్వంబు సఖుడ.

భానుకుటుంబములకు నా
భానుల కటు తప్పకుండ బ్రకాశము గల్గున్;
గాని, యిటు విశ్వమంతకు
నేనాడునులేదు విలువ; యిది సత్యంబౌ.

అన విని గర్వాతిశయము హృదంతరమందు జరింప, లోన నే ననుకొనుచుంటి : మూర్ఖుని నియంతృతరాజ్యము విశ్వవీథిలో అఖురజమంత యనౌ ననుచు; నంత వసుంధర జ్ఞప్తిరాగ నిగ్గున దలవంచి నాతలపు గూఢముగానవరించి పల్కితిన్.

ఇంతటి సత్యప్రియులను
ఇంతటి నిర్గర్వమతుల నెందును గన, మీ
స్వాంతంబున గాంతాశము
చింతాకంతయును లేక చెప్పితిరిటులన్.

నాకన్నన్ మహనీయులైన రవులున్నారన్న మీమాటకున్,
నాకుం జోద్యముగల్గె; నన్నరవి యౌన్నత్యంబు నిమ్మైత్తవ
ప్రాకామ్యంబున వర్తనల్ సలుపు స్వార్థత్యాగసంపత్తి మీ
ధీకారుణ్యము గౌరవంబు వెలుపుం వెల్లంబుగన్ భాస్కరా.

పలుమరు నీరజాతహితు ప్రస్తుతియించి, యనంతరంబు మీ
వలన ననంతవిశ్వపరిపాలనగు ప్రసమస్త ధర్మముల్
వెలితిదొలంగవింటి బహువిజ్ఞతచేకురె; నైనగాని మా
యిల మిమువీడి యవ్వల నెటెట్టులనుండెనొ చెప్పవేడెదన్.

తమకు ముద్దులకూతురు ధరణిదేవి
చిన్నదయ్యును వయసులో జిన్నదయ్యె
ప్రాణికోటులభరియించుభవ్యవృత్తి
మహితయౌచుజెలంగు మామాతృభూమి.

అని నే విన్నపమాచరింప విని నెయ్యంబార సూర్యుండు నీ
ఘనవిజ్ఞాన తృషాపనోదముగ పక్కాణింతు భూదేవిగాం
చినమార్పుల్ పరిణామసంచరణ నిశ్రేణీవిశేషంబులన్
వినవోయీకవితాతపస్వి, యనిగావించెం గథారంభమున్.

ధరణి యిన్నూరుకోట్ల వత్సరములపుడు
గండరించెను నామేనినుండి వీడి;
నెత్తుపుంగండలొకటౌట నెలవుకొనియె
దండ్రి యత్యుష్ణతత్త్వంబు తనయయందు.

విధివశంబున దనువులు వేరుపడియు
ప్రేమసూత్రాలుతెగవు మాహృదయములను;
మచ్ఛరీరభరాకృష్యమాణయగుచు
అవని నాచుట్టుదిరుగు జక్రానువృత్తి.

ఈవిధి బెక్కువత్సరములేగిన బైకొనునగ్నికీలలుం
దీవరమైనక్రొంబొగలు దిక్కులదాపములేపువేండ్రమిుం
జావ, గ్రమక్రమంబుగ బ్రశాంతతనొంది, తటాకమెండ బై
పైవడబారి కర్దముపక్కులుగట్టెడుపోల్కి జూపడెన్.

లోలోనం బరితప్తమై ద్రవముకల్లోలించి యుత్క్షిప్తమై
రాలం, గన్నులపండువైతనరె ధారాయంత్రనాళోద్గిర
త్తాలోత్తాల జలప్రకాండమున; దద్ధారారసంబుల్ పయిన్
బాలుల్వారి పటించి గట్టపడి రాచట్టుల్గ మున్నేర్పడెన్.

దినదినము గల్గు భూకంపతీవ్రతలకు
బైనిబెరడులు పెటిలి లోపలకుగృంగి
కాకకు గరంగి క్రమ్మర గల్లుగట్టె;
అట్టికల్లులె గిరులకు నడుగుబందు.

తొలుసృష్టి బండ లెట్లగు?
జలమని కొందరు వచింత్రు; సత్యం బేదో
పలుకుమయని నే వేడిన
జలజాతాప్తుండు సంతసంబున నుడివెఁ.

అతిగడంత్రించు వేడిమి నవనికాగ
నిరము వచ్చుటనెట్టులనిలుపనేర్చు?
బాష్పరూపంబుగా నభోభాగమందు
నంతరములేక యెల్లెడ నాక్రమించు.

జరిగె బెక్కేఁడు; లుష్ణాతిశయము కొంత
తొలగె; నావిరి తడివారి తొలకరింప
అంతరాగ్నికిదప్తమౌ నవనిబడిన
యంబుబిందులు చుయ్యనియావిరయ్యె.

గుంటు మిట్టలు గండులు గుట్టలునుగ
ధరణియెల్లను విషమమై పరగుచుండె;
అగ్నిపర్వతశిఖరంబు లచ్చటచట
గడుపులోమంటలను వెళ్లగ్రక్కుచుండె.

కరగిన శిలాద్రవంబు ఉప్పరముజిమ్మ
లోన గొన్నిథలంబులు లోత్తలగుచు
పైనగట్టినరాచట్టు పగిలిక్రుంగి
వెడలుపైన పల్లంబులు గడలుకొనియె.

నిన్నజూచినతలములు నేడుచూడ
గనుగొనగరానియటు మార్పుగాంచియుండు;
క్షణముక్షణమును భిన్నవికారములను
జెందుచుండెను ధాత్రి విచిత్రగతుల.

మొయిలుగప్పెను; వానలు మొదలువెట్టె
ధరణిపయిని దాటిమానెత్తుదాక నెరసి
ఆవిరిం బొగ గాలి కుయ్యాలలూగి
మత్కారాంశుప్రసారంబు మరుగువెట్టె.

అంతట నాదిమప్రకృతి యాకులభౌతికఖేలనంబు దు
ర్దాంతముగాజెలంగె; జలదప్రళయంబన వానపట్టె; ది
గ్దంతుల కుంభముల్ పగులపన్నెడునట్టులవజ్రపాతముల్
ఇంతకునంతకుంబ్రబలె; హెచ్చె సమీరవిహారదర్పముల్.

వాననీటను బల్లాలు పల్లతెల్ల
నిండి వారిధులయ్యె; ఆనీటియందు
అవనిగల యుప్పు ధాతు లోహములు గలసి
యొక యపూర్వరసాయనయోగ మొదవె.

శ్యామలోహిత కిరణసంస్పర్శనముల
జలధియొరల కొరపుష్పంబు పూచె;
మంచునీటను ఆపూత మాగి కరగి
జిగురునురుగుల పొరయొండు సృష్టియయ్యె.

అందుల నణుప్రమాణములైన సూక్ష్మ
జీవులెన్నెన్ని ప్రభవించి చెదరిపోయె;
అలలపైదేలి యంచులకరిగెగొన్ని
అడుగుభాగంబు మరికొన్ని యాశ్రయించె.

అన విని నే బ్రశ్నించితి
పనబాష్ప, యిదెట్లు సాధ్యపడునో! జీవం
బెనయునది సూక్ష్మమయ్యును
జనియించునె యొండు మృతరసాయనశక్తిన్.

చేతనాచేతనవిచారసిద్ధిగన్న
సత్యవిద్భులకు దీన సంశయములేదు;
కాని, మనుజుల కింక నాజ్ఞానరశ్మి
కలుగ; నొకవేళ నికముందు గలుగవచ్చు.

అట్టులైనను దేవుని కాటవిడుపు
నిచ్చి పంపించవచ్చు నోయినుడ! సృష్టి
యాదిశక్తికృతంబని యంటివపుడు;
ఇటు రసాయనశక్తి యిందేలవచ్చె?

ఆదిశక్తియన్నను దైవమన్న నొకటె;
మాటభేదమె యసలులో మార్పులేదు;
ప్రకృతిపురుషులు క్షీరనీరంబులటుల
గలసి, యవిభాజ్యులై యొక్క మొలసియుంద్రు.

ప్రకృతిపురుషులన్నను రెండువ్యక్తులటుల
వేరుగాపోయి యొకదాని భిన్నదశలె;
ఆదిశక్తియటంటి మున్నట్టిదాని;
అయిన, నిపుడేమి తలక్రిందు లరసితీవు?

* కాలావకాశములు ము
న్నలిఁ భిన్నంబులయ్యు నుత్తమశాస్త్ర
జ్వాలాతప్తమయి కరగి
మేళకమయి యొక్కటౌచు మెలగవె నేడుఁ?

దైవమన సృష్టిబాహ్యమై తనరదెపుడు;
అణువునందును బ్రహ్మాండమందు నేక
పరమౌ నాశక్తి వ్యాపించి సర్వసృష్టి
హేతువయి నిత్యవిశ్వసంసృతిని నడపు.

అటు రసాయనక్రియలకు నడుగుబందు
అణువెయౌటను లేదె యందాదిశక్తి?
కార్యకారణబంధంబు గడపరాని
సృష్టిమాత్రంబు; నిత్యమై చెలగునోయి.

తన రూపమునకు బ్రతికృతి
యన మనుజుని సృష్టిచేసె నాదిమదేవుం
డని పలికి తప్పు; మనుజుడు
తనరూపమె యంటగట్టె దైవంబునకుఁ.

* కాలావకాశములు — Time and Space.

పిల్లి యూహించు దేవుని బిల్లియటుల
నక్కకుఁ దేవుఁడుండిన నక్కరూపె;
అన్నిరూపంబులెత్తెడియాదిశక్తి
కొక్కరూపమె ప్రియమయియుండనేల?

అనియటుసూర్యుఁడాడిన యదర్థము చక్కగబోధగాక నా మనమునకలంగిరేగి యనుమానము సంశయముప్పతిల్లె; దేవునివిషయంబులెందు దుదిపోవవు, రావణుకాష్ఠమట్లు నిత్యనవములై చిరంతనములై కననౌ నెవరెన్నిచెప్పనన్.

పొదగదలు తీవలాగిన,
మొదలిడ నిచర్చయింక ముగియకసాగుం;
గదలెడు దరణియు, సూరక
పదరక శేషంబువినుట భావ్యమటంచుఁ.

ప్రథమమున సూక్ష్మజీవులు ప్రబలెనంచు
నంటి రామీద నేమయ్యె నానతిండు;
చిత్రచిత్రంబుగానెప్పు సృష్టిచరిత
వినవలతునన్న సూర్యుండు వినిచెనంత.

జననంబు మాతృకార్యము
తనుభంగము సంతువృద్ధి తత్ క్షణమందే
కొనసాగు సూక్ష్మజీవుల
కనయము; నిటు లకలేదు లరగినపిదపన్.

పరిసరంబుల భేదంబుబట్టి వాని
యందు బ్రత్యేకతలుకొన్ని వ్యక్తమయ్యె;
అంచునున్నవి పచ్చనియణువులయ్యె;
క్రిందనున్నవి వేరెయాకృతులువడసె.

అంచుల బచ్చనియణువుల
సంచయములుచేరి బూజుబాలకమటు వ్యా
పించి చిరుపాచిపట్టిన
సంచున బయినీట విరివి సాగుచునుండెన్.

మిగతయణువులు కంటికిదగులునటుల
గృహములుగామారి పరిణామమెనయుచుండె;
జీవనస్పర్ధ సామాన్యచేష్టయౌట
బలముగలయవి దుర్బలములను మెసవు.

కడలినీర మింకను ధాతుకలితమయ్యె;
శీతవాతోష్ణపరిసరస్థితులు మారె?
అనువుపడని బహుప్రాణు లంతరించె;
అన్యజీవులు మార్పుల ననుసరించె.

నాచుతీపలగొమ్మలు ననలువెట్టి
వనధితరుజాతులై మున్ను పరిణమించె;
అడుగుబురదను సున్నంబు గడలుకొనుట
పగడతీగలు గుల్లజీవములు పుట్టె.

ఉదధియప్పుడు గాఢమైయుండుకతన
వర్షఋతువుల బెల్లుబ్బి పైకిబార
బ్రక్కపడియలు గుంటలు పర్రలందు
ప్రాణికోటులు నాచుతీవలును జేరె.

అంత గాలానుసరణి నిరస్థికములు
పలుతెరగులైన జలచరములు జనించె;
జల్లిచేపలు పీతలు సలిలవృశ్చి
కములు నత్తల్లు జలగలు గండరించె.

పడియలలోనదప్ప బెరపట్టుల వృక్షము లేవిలేవు; మీ
పుడమియు బచ్చవారక యపూర్వమరుస్థలమట్లు చూపడెం;
బొడపుగ దాటుబోదెలటుపుట్టియుఁబ్రాకులు, పూలు పండ్లు చొ
ప్పడవు; తరుప్రకాండముల బాచియె యాకులుగా జిగిర్చెడుఁన్

జలమింకిన పడియలలో
నిలిచిన భూజములు కొన్నినెలలు పడిపడఁన్
అలవాటుపరచుకొని యు
ప్పల నిర్జలభూమి మొలచి పర్విలుచుంటెన్.

జలనిధి బుట్టె వెన్నెముకచట్టముగల్గినచేప, లవ్వియే
యిలగల సర్వజంతువులసృష్టికి మూలమటన్న, వింతగా
దలచి యిటంటి: నోతరుణ, తథ్యమె? పూర్వము మానవావళుల్
కలిగిరి కోతిసంతతులుగాననిచెప్పితి రిందుకేమనన్.

వినుమోయీ, సర్వంబును
వినుటకుమున్నెల యింతవేగిరపడగన్;
గనుగొందువీవె చేపలు
వననిధివిడి బయలుఁబ్రాకివచ్చినవిధమున్.

పడియలనీరమింకి పడబారినపంకమునందు గూరికొం
చడుగుననుండి గాలికయి యౌదలలెత్తుచు బీల్చుచుంట నే
ర్పడె దమదేహమందు నిరుప్రక్కల నూపిరితిత్తు; లాపయిం
బొడమెను వానిసంతతుల బూర్వముకంటెను గొన్నిభేదముల్.

గాలిపీల్చుట పొడినేల గదలుచుంట
ఎండవేడికి దాళుట యెగిరిపడుట
నలవరచుకొన్న నూత్నమత్స్యముల సంతు
బయట నిటను నడయాడ వలతు లయ్యె.

అక్కరనుబట్టి రెక్కలయందు మార్పు
గలిగి లక్షలయేండ్లకు గాళులౌట
జలచరత్వము నానాట సమసిపోయి
భూచరత్వము సమకూడి పొదలె నవియు.

ఇలపయి వింతవింతల మహీజము లుద్భవమయ్యె; బోదెలం
గలిగె బెరళ్లు; నాకులౌడికమ్ముగ గొమ్మలనిమ్మడించె; భూ
స్థలిని అరణ్యముల్ బలిసె; దామరతంపరగాగ దోమ లీ
గలు పురుగుల్ చిటారములు కాటుకచీమలు పుట్టి వెల్వడెన్.

బయట నీట జరించెడు పాము తేలు
కప్ప తాబేటిజాతులు కానిపించె;
నవియు గొన్నేండ్లకు నరణ్య మాశ్రయించె;
జలధిజీవులు మెట్టవాసంబు గాంచె.

తొండలు బల్లులు నలికిచు
తండంబులు ఉద్భవించి తరములు మారెఁ;
మెండుకొనె కొండచిలువలు
కొండొక యాసురమృగంబు గోచరమయ్యెఁ.

దంతి కెనిమిది బారల గొంతుశ్రోవి
యంత నిడుపైనవాలంబు నతుకుపెట్ట
నెట్టులుండునొ యట్టియాకృతినిగల్గి
యాబృహజ్జంతు వెసగు జలాశయముల.

వాలముత్రిప్పికొట్ట బెనుపత్రల నీరము పైకిలేచి మే
ఘాలయమంటి వర్షమటు లచ్చట రాలును; తోకమోపి ముఁ
గాళులనెత్తి యున్నతపు గంధర జాపిన జెట్టుపైని ప
త్రాలును నోటికందు; వనరాజన నాసురజంతు వేలెడిఁ.

కాననమందు నాసురమృగంబు మరొక్కటి గానిపించ లో
నూనిన కోపవహ్ని వెలికూర్చెడునోయన రోజి రొప్పుచున్
దానిబయిం బడం దరలు, దాకొని రెండు పరస్పరంబు నే
త్రానసముల్ రయంబున నఖాగ్రములన్ క్షతివార జీల్చుచున్.

తోకతోకలగించి తునుపంగమెలివెట్టి
యన్యోన్యబలశక్తులరయలాగు;
లాగి పట్టుసడల్చి వేగంబ పయినిక్కి
యొండొండుగొంతుక లొడిసికొనుకు;
కొరికి లోదనియక కుయిబెట్టి గర్జించి
పొట్టలో దలబెట్టి నెట్టిపొడుచు;
పొడిచి క్రిందకునొక్కి పొర్లింప నదిలేచి
తోక గిర్రనిత్రిప్పి తుక్కురేపు;

రాతితిప్పలదొరగు నిర్ఝరములటు
కాయమున నెత్తురూటలు గారుచుండ
అలసిసొలసి యందొక్కటి యంతరించు;
ఇంకొకటి తెప్పిరిలి వనమేలుచుండు.

గాలికి నెండకుం దరచుగా జడివెట్టిన నీటి ధాటికిఁ
రాల గరంగు ధూళి కుధరంబుల బేరిన బంకమన్ను జం
బాలము గాగ నెల్లెడల బారి కుజవ్రజ మున్న పల్లవుఁ
నేలలు నింద నందు రమణీయసుమంబులు పూచె పల్లుం

ఎగురగల పాము లుడుతలు వృద్ధిచెందె;
పలువిధములైన గబ్బిళములు జనించె;
అవల నీకలు రెక్కలు నంకురించి
గగనచర పక్షిజాలము గానిపించె.

నిసువులకు జన్నుగుడిపెడు
పసరంబులు కరితురంగవర్గంబులు ముం
గిసలుఁ జింకలు సింగము
లెసగెను, పచియింపనలవియే యవియెల్లఁ?

విపినచరమర్కటంబులు వేనవేలు
తెగలుగానయ్యె బరిసరస్థితులబట్టి;
ఆకృతుల లావుపొడుగుల నాచరణల
నలవడియె భేదగతులు కాలానుసరణి.

వానిలో వాలహీనములైన నాల్గు
జాతులు క్రమక్రమంబుగ జననమొందె;
అందు నొకజాతి వానర మవయవముల
బోలికల మానవునకు దాపునకువచ్చు.

ఆ నవీనవానరసంఘ మన్నికడల
కేగి తెగలుగ విడివడి వృద్ధిగాంచె;
నందు నొకతెగసంతతి యవని నేడు
సంచరించెడు మానవజాతులెల్ల.

వానరమునుండి యాదిమమానవుండు
పరిణమించుట కొక కోటివత్సరములు
పట్టె; ప్రారంభమాయెను వాని నాగ
రకత ముప్పదివేల వర్షముల నాడు.

ఆది చేతనాణువు జన్మమైనదాది
నూటపదికోట్లయేడులు దాటెనోయి,
యేకమూలమునుండి యనేకరూప
వర్గములు భూతధాత్రిని బరిణమింప.

కలవిషయంబులెల్ల సరిగావివరించిన నెంతకాలమో
వలయును; నిందు నందు నొక పట్టును సూక్ష్మముగా వచించితిం
దెలియుము యన్న భాస్కరుడు, తృప్తుడ నౌచు గృతజ్ఞతామతిం
దెలుప నమస్కృతుల్ సలిపితిన్ క్షమియింపుడటన్న రీతిగన్.

[భారతిలో ప్రకటితము: 1943]



భారతిప్రెస్ (8/37 ఆనకట్టరోడ్డు) నెల్లూరు-1.